# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క

సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 మార్చి 1979 సంచిక 3


## విషయానుక్రమణిక



**చందాదారులు గమనించండి!**

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-4-79" అనియుండిన, మీ చందా ఏప్రిల్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) మార్చి నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

—: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## ౩

హైందవ మతము అనేక దేవతల నారాధించుచున్నదనియు, మత భేదములలో పెనుగులాడుచున్నదనియు, దేశములోని కలహములకు కల్లోలములకూ ఈ విధమైన మతభేదములే మూలకారణమనియూ కొందరు భ్రమించుచున్నారు. ఇది సత్యము కాదు, వివేక శూన్యులాడు విలాసవచనములు. పాశ్చాత్య దేశీయులందరూ ఇంచుమించు ఒక్క క్రీస్తు మతమునకు జెందియుండియూ, ఒక్క దైవమునే ఆరాధించువారై యుండియూ అడవులలోని మృగములకన్నా ఘోరముగ దేశాభిమానమను పేర యుద్ధ నెపమున ఒకరినొకరే కాక నిరపరాధులకు ఇతర జనానీకమును సహితము స్త్రీ బాలవృద్ధులను సహితము భస్మీభూతము చేయుచున్నారే ఇట్టి ఘోరచర్యలకు భీభత్స కారణ్యరహిత, బుద్ధిహీనమగు పైశాచిక ప్రవృత్తులకు మతములే కారణములా? ఏకమతము వారలై ఏకారాధకులైన ఈ క్రూరులకు మతమునకు వెనుకదాగిన దేదైనా యున్నదా? కల్లోలములకు, కలహములకు మతములేమాత్రమూ కారణము కాదు.

జర్మనీ దేశములో జాతిమతకుల గోత్రాది భేదములకు తావు లేదు. వైజ్ఞానిక, విజ్ఞానములందు అసమాన ప్రజ్ఞ సాధించుకొన్న దేశము, బల, శౌర్య, పరాక్రమములందు అగ్రస్థానమునందుకొన్నది. అట్టి దేశము ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము నాలుగు దేశముల వారిచే నాలుగు భాగములుగా చీల్చి వారలచే పరి

పాలింపబడుచున్నది. యెట్టి విభేదములు లేని, యెట్టి మతభేదములు లేని, యెట్టి అనేక దేవారాధనలు లేని జపానుదేశము కూడా అన్య దేశీయుల ఆధిపత్యము క్రింద కొంతకాలము క్రుగ్గవలసివచ్చెను. కారణమేమి? దేశముల యొక్క అధోగతులకు మత విభేదములు మాత్రమే కారణము కాదు అని జర్మనీ గుణపాఠము నేర్పించుటలేదా?

భేదములు లేని ప్రపంచమును యెవ్వరూ వూహించలేరు. భేదములు ప్రాణుల యొక్క అంతరంగిక బుద్ధి సంస్కార జనితములు వక్కొక్క జన్మము వక్కొక్క బుద్ధి సంస్కారపు బాహ్య స్వరూపము సృష్టిలో నున్న జడములు, అజడములు అన్నియూ బుద్ధిభేదముల యొక్క పరిణామ కారణము. చిలుక చూపు వక విధముగ నుండును, కాకి చూపు మరొక విధముగ నుండును. జంతు ప్రకృతి వేరు, మానవ ప్రకృతివేరు, మానవునకు మానవునకూ జ్ఞానమున తారతమ్యము కలదు. అంతే కాదు మానవుల దేహచ్ఛాయ, అందచందములందు కూడా అవయవములందు కూడా, వారల అభిమానములూ, భావములు మొదలగు గుణములన్నియూ బుద్ధి ఆధార విషయములే కాక వ్యక్తి గతములును కూడా అయివుండును. అంతవరకూ మనము పోవనక్కరలేదు. వకే గర్భమున పుట్టిన కవల పిల్లలు సహితము వక్క పోలిక నుండరు, వకే గుణములలో నుండరు. దీనికి కారణమేమి? బుద్ధి సంస్కారమే కావున సృష్టిలో ఆ భేదములను మానవ కోటియందు సర్వ సమానత్వమును యేనాటికినీ చూడలేరు, సాధ్యము కాదు, చూడవలెనన్నది వూహాగానమే, గగన కుసుమమే.

మృగము తాను మృగముననను జ్ఞానముతోను, పక్షి తాను పక్షినను జ్ఞానముతోను, స్త్రీ తాను స్త్రీనను జ్ఞానముతోను, పురుషుడు తాను పురుషుడనను జ్ఞానముతోను వ్యవహరించు చున్నారు. నిద్రకు పూర్వమున్న జ్ఞానముతోనే జీవుడు నిద్రానంతరము కూడా తన పని మొదలిడును, మానవుడు క్రిందటి దినము వకపనిని యెంతవరకూ చేసి విడచిపెట్టి యుండునో మరు దినమున నిద్రనుండి లేచిన పిమ్మట ఆ యా పనులను అచ్చట నుండియే తిరిగి ప్రారంభించును. అటులనే మానవుడు వెనుకటి జన్మమున వ్యవహారము యెచ్చటి వరకూ చేసి వదలి మరణించునో అచ్చటి నుండియే తిరిగి మరుజన్మమున వ్యవహరింప మొదలిడును. ఈ విషయమును "యం యం వాపే స్మరన్ భావం త్య జత్యంతే కళేబరం".

"తంతమేవైతి కాంతేయ సదా తద్భావ భావితః" అన్న గీతా చార్యుని వాక్యమును స్మరించిన తెలియును. జీవుని మృతదేహమును వదలి పోవు సమయమున కలుగుభావము ననుసరించి ఉత్తర జన్మ కలుగును.

ఎట్టి భావము కలుగునన లోగడ జన్మలో యెట్టి భావముతో వ్యవహరించు కొనుచుండెనో

అట్టి భావమునకు అనుకూలమగు భావమే మృత్యు సమయమున కలుగుచుండును. దీనిని సూక్ష్మముగా విచారించిన బుద్ధి సంస్కారముల ననుసరించియే కలుగుచున్నదన్నది పరమ సత్యమని తెలుసు.

రూప సామాన్యములందు మానవులందరూ సమానముగా గోచరించినా అంతర్భేదములు అనేకములుండును. జాతి అనగా ఆకారములు, బుద్ధులయొక్క బాహ్యరూపములు అంతకంటే వేరొకటి కాదు. వ్యక్తి అనగా ఆకారము గల వస్తువు. మనిషి, చెట్టు, గుట్ట, పిట్ట, నక్క, కుక్క, గోవు, పాము, తేలు ఇత్యాది శబ్దములు ఆయా ఆకారమున గల జాతిని చెప్పును, వ్యక్తికి నాశము కలదు. జాతికి నాశములేదు. మనిషి నశించిననూ మానవ జాతి నశించదు. వృక్షము కూలి కాలి భస్మమయిననూ వృక్ష జాతి యేనాటికీ నశించదు. నిత్యమైన జాతికి నిర్మూల మేనాటికినీ జరుగదు, కాదు.

మన నిత్యానుభవములో నున్న చిన్న విషయాలను చక్కగా విచారించి చూచిన ఇట్టి సత్యము ప్రత్యక్ష ప్రమాణముగా కనుపించును. మానవత్వమున మానవజాతి అంతా ఒకటే అయినను మానవుని యెన్నుకొను సమయమున అతని గుణ గణములు. అధికార స్థితి గతులు చూతుము. ఉదాహరణము నకు ఒక ఆవు విషయమున చూడుడు. గోత్వమందు గోజాతి అంతయునూఒక్కటే, కానీ ఆవును కొనవలె నంటే దాని పుట్టుక దాని లక్షణములు చూచి తీసికొందుము కదా! అది మంచి పాలు యివ్వవలెను, చూచుటకు పుష్టిగా అందముగా యుండవలెను. అంతే కాక అది సాధువయి వుండవలెను, ఇట్టి సుగుణములు కల దానినే కొందుము కానీ గోజాతి కదా అని ఒక్క పడి పాలియ్యని గొడ్డు గోవును, సాధుగుణములు లేని దానిని యెవ్వరూ తెలిసి కొనరు. ఇక్కడ గోత్వలక్షణము గోవులన్నింటి యందూ సమానమే. మన యెన్నిక ఆకార సమానత్వముపై ఆధారపడక జాతి వర్ణ గుణాదుల మీద ఆధారపడి యుండును, అంతే కదా? అటులనే మానవజాతి యేక రూపమైననూ గుణాది భేదముల మీద ఆధారపడి యుండునన్నది గ్రహించ వలసిన విషయము. మరొక విషయమున మరి కొంత లోతునకు దిగి విచారించిన ఉచ్ఛ, నీచ భావములు సహజము లనక తప్పదు. మలమూత్రములలో భేదమే మాత్రము లేకున్ననూ గోవుకు సంబంధించిన మూత్రమలములు మాత్రము పవిత్రము లనియు ఇతర జాతికి సంబంధించి మలమూత్రములు అపవిత్రములనియూ భావించుచుందురు. అటులనే అగ్ని విషయమున కూడను అగ్ని అగ్నియే, అందులోని గుణములు ఒక్కటే. అయిననూ ఉచ్ఛనీచ భేదము వుండక తప్పదు. మన యింటిలో దీపమును వెలిగించు కొందుము, పొయ్యి మంట పెట్టుకొందుము.

యజ్ఞ యాగాదులలో హోమమునకై అగ్నిని రగల్చు కొందుము. అయితే ఇవి పవిత్ర మనియు దైవ స్వరూపము అనియనియూ తలంతుము, పూజింతుము నమస్కరింతుము,

అదే అగ్ని స్మశానములో కళేబరమును కాల్చుచుండగా ఆ నిప్పుతో యెట్టి సహాయ మునూ ఆశించము, దానికి నమస్కరించము, ఆ అగ్నిలో రొట్టెలు కాల్చుకొనము, దీప ములు వెలిగించుకోము, కారణమేమి? అది అపవిత్రము అని మన భావము. అటులనే మానవుడు కూడనూ రూపములందు అందరూ వక్కటే అయిననూ దేహాదివుపాదులననుస రించి గుణ ప్రవర్తనల ననుసరించి ఇతదు శ్రేష్ఠుడనియు, ఇతడు అశ్రేష్ఠుడనియు చెప్పక తప్పదు. విద్యుత్ ప్రవాహము వక్కటే అయి నను బల్బుల తారతమ్యములననుసరించి వాటి ప్రకాశము లందు వుచ్ఛ, నీచ్ఛ భేదములు మనము చూచుచునే యున్నాము. పై విషయ ములను జక్కగా గుర్తించిన, విచారించిన ప్రపంచ వ్యవహారము నడచుటకు భేదములు, వుచ్ఛ నీచ స్థాయిలు, వర్ణ, జాతి మతములు మొదలగు తారతమ్యములు, తప్పనిసరిగా వుండియే తీరవలెను. లేకున్న కాల చక్రము సక్రమముగా పనిచేయజాలదు. ఇది భగవత్ నిర్ణయము.



# శ్రీ సత్యసాయి విద్యావిహార్

నందనవనం — ఊటకమండ్.

ఈ విద్యాలయమునకు 1979 ఆగష్టు 1వ తేదీన సంవత్సరారంభము. 2, 3, 4 తరగతులలో సీట్లు కాళీలేవు. ఆగష్టు నెలలో 30 మంది బాలబాలికలకు మాత్రమే 1వ తరగతిలో సీట్లు యివ్వబడును.

ప్రవేశము కోరువారు, బాలుడా, బాలికయా, వయస్సు, ఇంతకు పూర్వమున్న విద్యాను భవం ప్రిన్సిపాల్‌కు ముందుగా తెలిపి దరఖాస్తు ఫారమును తదితర వివరములను తెప్పించు కొనవలెను.

# పర్వదినములు

అన్నియు తెలిసినవారు అవనియందులేరు
ఏమియు తెలియక ఎవ్వడుండు
కొంచెమెరిగినవాడు కించిజ్ఞుడగునయా
ఉన్నమాట తెలుపుచున్నమాట.

ప్రేమ స్వరూపులారా!

భారతీయ సంస్కృతి యందు, హిందూ చరిత్రలో, ప్రాచీన జీవితములో పురాణమనునది సువిశాల స్థానమును చేరుకున్నది. సృష్టి, పుష్టి, తుష్టిని అందించేటటువంటి దివ్యత్వ స్వరూపము ధరించునది భారతీయుల పురాణములు. భారతీయ ఆశయము భగవత్సందర్శనము. దైవానుభూతి, భారతదేశము అనగా భగవత్ రతి గల దేశమని భారతీయుల దర్శనమే భరతవర్షమని దీనికి మరొక రూపము ఇట్టి పవిత్ర భారతీయ దర్శనమైనటువంటి దివ్యభావములు సదాచారముచే, సద్గుణములచే, సత్ప్రవర్తనచేసాధించి, శోధించి అనుభవించు ఆనందమే భారతీయులయొక్క పరమావధి.

పురాణముల యొక్క సత్యస్వరూపమును గుర్తించలేని వ్యక్తుల. పుక్కిటి పురాణములుగా భావించుతూ దైవమే లేదని, పునర్జన్మము కాదనియు, కర్మఫలితమే లేదనియు వాదించేటటువంటి పరిస్థితి ఈనాడు భారతదేశములో విరివిగా పెరిగిపోతున్నది. పవిత్రమైన భారతదేశమునందు జన్మించిన వ్యక్తులు కూడను, ఇట్టి సత్యస్వరూపమును గుర్తించుకొనలేక వారు కూడను అపోహలకు గురియై అన్యాయ, అక్రమ, అనాచారములే తమ జీవిత లక్ష్యముగా భావించి ఈ విధమైన ప్రచారములకు, ప్రబోధములకు కంకణం కట్టుకోవటము కూడను కొంత దురదృష్టముగ కనిపించుచున్నది. నా తల్లి గొడ్డురాలు అని చెప్పేటటువంటి యిట్టివాదనలకు ఏ మాత్రము అవకాశము అందించక యిట్టి అజ్ఞానులకు ఏ మాత్రము మనము వశముగాక మన దివ్యత్వమును ఆవిర్భవింప చేసికొనేటటువంటి ఆత్మసాక్షాత్కార పరిస్థితిని గుర్తించి మన సాధనలు, మన మార్గములు మనయొక్క గమ్యమును స్మరించి తరించుటకు వచ్చినటు వంటివి పవిత్రమైన పర్వదినములు.

కాని ఈనాటి పర్వదినములను కేవలము పర్వదినలుగా భావించి ఆనందించుచున్నారు. కాని పర్వదినము యొక్క అంతరార్థము కాని, పర్వదినముల యొక్క గంభీరమైన పవిత్రతకాని, భారతీయులు కూడను గుర్తించుటలేదు.

పురాణములను ప్రాచీనమైనటు వంటివని ఒక అర్థము. పురాణములనగా పూర్వము ఉండినటు వంటిదని మరియొక అర్థము. కనుకనే వీటిని ఆధారము చేసుకొని, వీటిని పురస్కరించుకొని, ఋగ్వేదమునందు వాయు పురాణము, బ్రహ్మాండ పురాణము పద్మపురాణము ఇత్యాది పురాణములు వేదమునందు కూడను సూచించుచున్నవి. కనుక వేదసమానమైనటువంటి పురాణముల యొక్క ప్రమాణములను

గుర్తించుట కేవలము ఏదో కల్పితమైన పురాణములుగ భావించి అలక్ష్యము చేయుట భారతీయుల యొక్క కర్తవ్యముకాదు.

పవిత్రాత్మ స్వరూపులైన భారతీయులారా!

నిజమైనటువంటి భారతతత్త్వమును మనము నిరూపించే నిమిత్తమై భారత సంస్కృతిని వ్యాపింప జేసే సంకల్పమును మనము ధరించి, వరించి తరింపజేయు మార్గమును అవలంబించుటకు పురాణములను మనము ప్రమాణముగా తీసుకొని వాటియొక్క నిబంధలను, వాటియొక్క అనుభూతులను మనము దివ్యత్వమునకు తెప్పించుకొను ప్రయత్నమునకు పూనుకోవటం అత్యవసరము. మానవత్వమనగా దివ్యత్వముతో కూడిన ఆత్మతత్వమనే సత్యమును గుర్తించుట అత్యవసరము అన్ని జీవరాశులవలే మానవుని ఒక జీవరాశిగా భావించుట సరియైనటు వంటిదికాదు. 'జంతూనాం నరజన్మ దుర్లభం' అన్ని జీవరాశులయందు కూడను మానవ జన్మము ఉత్కృష్టమైనటు వంటి దనియు, పవిత్రమైనటు వంటిదనియు, సార్థకమైనటు వంటిదనియు, దివ్యమైనటువంటిదనియు నిరూపించినవి పురాణములు. ఇట్టి విలువైన, పవిత్రమైన, గంభీరమైన మానవత్వమును కేవలము మనము ఈనాడు అర్థము చేసుకొనక మసిబొగ్గువలె ఉపయోగ పెట్టుకొనుచున్నాము. దివ్యమైన మానవత్వమును పవిత్రమైన మార్గమును అవలంబించే నిమిత్తమై దివ్యత్వమును ఆశించుతున్నాము ఆ దివ్యత్వము మనయందే, మన హృదయాంతరాళమునందే, మనహృదయ స్థానమునందే, మనపవిత్రమైన భావమునందే ఉన్నదికాని, అన్యదేశము నందు కాని, స్థానమునందు కాని లేదనేటువంటి సత్యమును కూడను గుర్తించుట అత్యవసరము.

ఈనాడు మానవుడు మితిమీరిన ఆశలకు గురియై తన యొక్క తత్వమును కూడను మరచి ఏదో భౌతికమైన సుఖముల నిమిత్తమై తన విలువైన జీవితమును కూడను దుర్వినియోగపరచుకొనుచున్నారు. ఆశలకు హద్దులేక మారిపోవుచున్నాడు మానవుడు. తన తత్త్వమేమో తాను గుర్తించుకొనలేక పోవుచున్నాడు. భగవత్ రతి కలిగిన భారత దేశమునందు తనయొక్క నిజతత్త్వమును మరచినటువంటువాడు. నిజముగా మానవుడు కాదనే చెప్పవచ్చును. పురాణములు ఆదర్శవంతమైన ప్రమాణములను ప్రబోధిస్తూ అనేక విధములైన మార్గములను నిరూపించుతూ తన గమ్యమును హెచ్చరింపజేయుచున్నవి.

సృష్టి, తుష్టి, పుష్టి ఈ మూడింటిద్వారా మానవత్వము నందుష్టి గడిపేటటువంటి నిమిత్తము ఏర్పడినటువంటిదను సత్యమును గుర్తింపవలెను. ఈ సృష్టియొక్క తత్త్వమునే బ్రహ్మత్వముగా భావించి దీనినే సరస్వతీదేవిగా ఆరాధించినారు ప్రాచీనులు. దేహములకు, ఇంద్రియములకు పుష్టిని అందించుతూ వచ్చిన లక్ష్మిగా భావించినారు ప్రాచీనులు. మానసిక సంబంధమైన తృష్ణను కొంతవరకు తృప్తిపరచి దీనినే చల్లార్చి యీ మానవత్వమునుండి దివ్యత్వమునకు కొనిపోయేటటువంటి పవిత్ర మార్గమును అందుకొనిన శివతత్త్వమునే దేవిగా భావించినారు. ఈ మూడింటి ఆధారములను పురస్కరించుకొనియే మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాదుర్గ అని ఈ ముమ్మూర్తులను ఆరాధించన పవిత్రమైన పర్వదినమే యీ నవరాత్రి మహోత్సవము. అనగా సృష్టి, స్థితి లయకారులైనటు వంటి దైవత్వమును ఆరాధించి తమ సృష్టింపబడిన మానవత్వమును సార్థకము కావించుకొనె ఉపాయము నిమిత్తమై ఏర్పడినటువంటిదను పవిత్రమైన మార్గమని గుర్తించుకొనవలెను.

భగవదన్వేషణలోపల తొలి విజయమును సాధించినటు వంటిది పవిత్రమైన భారతదేశము. ఇట్టి నైతికి

ధార్మిక, ఆధ్యాత్మికముల యందు పవిత్రమైన ముందంజవేసి దిగ్విజయమును సాధించి ఆదర్శము అందించినటువంటిది పవిత్రమైన భారతదేశము. కనుకనే త్రిమూర్తి స్వరూపమైన దివ్యత్వమును గుర్తింపచేసే నిమిత్తమై త్రిరాత్రులు అని కూడను ఏర్పడుతూ వచ్చినవి. నవరాత్రి, శివరాత్రి, సంక్రాంతి అనేటటువంటి మూడురాత్రులు పవిత్రమైన పర్వదినములుగా ఆచరించుతూ వచ్చుచున్నారు. భారతీయులు ప్రాచీన కాలమునుండి. కనుక పర్వదినములనగా ఏదో ఒక విధమైన ఆహార ఆనందములతో అనుభవించేటువంటి నిమిత్తమై ఏర్పడినటువంటివి కాదనే సత్యమును మనము గుర్తించి ఆరాధన నిమిత్తమై ఆత్మతత్వ నిమిత్తమై, అనుగ్రహ నిమిత్తమై ఆత్మానేషణ ఏర్పడినటువంటి సత్యస్వరూపములుగా గుర్తించుట అత్యవసరము.

ఎంత చదువులు చదివి నప్పటికి, ఎంత భుజబలము ఉండి నప్పటికిని ఎంత బుద్ధి బలము కలిగినప్పటికి, ఎంత ధన బలముతో తులతూగినప్పటికిని దైవ బలము, ధర్మబలము లేకపోయిన మానవత్వము నిరుపయోగ మవుతుందనే సత్యమును నిరూపించి నటువంటిది భారతీయ పర్వదినములు. కనుకనే పవిత్రమైన భారతీయ సంస్కృతియందు ప్రధానమైనటువంటి మున్ముందు చెప్పిన పదములు మాతృదేవోభవ, పితృదేవభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ యీ నాలుగింటి యొక్క తత్త్వమును భారతీయులు మొదట ప్రచారము చేయుచువచ్చారు. కనుకనే **'you love your mother, you love your father, you love your guru, you love your guest,** యీ తత్త్వమును, **Relations**ను కూడ మనము **love**చేయవలయును. యావత్తు మానవులను మనము **love** చేయవలయును. అందరియందున్న దివ్యత్వమే ఈశ్వరత్వముగా భావించవలయును. 'ఈశావాస్యమిదం సర్వం' అందరియందు ఈశ్వరత్వమున్నదను సత్యమును మనము నిరూపింప జేసిన జ్ఞాపకార్థముగా పర్వదినములు అనుభవించపలెను.

కనుక ప్రేమతత్త్వమును విశాలపరచుకొని సర్వత్రా వ్యాపింపచేసేటటువంటి సమత్వమును అనుభవింప చేయు మహా పర్వదినములుగా ఈ పర్వదినములను భావించి నేటినుంచి మనలో ఉన్నటువంటి దుర్గుణములు, దురహంకారములు, దుర్భావములు, దుష్టచేష్టలు మనము దూరము కావించుకొని, సద్భావములు సదాలోచనలు, సచ్చింతలు, సత్కర్మలు ఆచరించుటకు ఈ దేహమును సమాజములో అంకితము కావించవలెనని ఈనాడు దృఢ సంకల్పమునకు మనము పూనుకోవాలి.

ప్రేమస్వరూపులారా!

ఈ పది దినములు కూడను మన పవిత్రమైన చరిత్రలైన పురాణములు ప్రబోధించిన దివ్యమార్గములను మనము కొంతవరకు గ్రహించి, ఆనందించి, అనుభవించి ఆచరించుటకు పూనుకోవాలని నేను ఆశించుతూ ఈయొక్క తీక్షణమైన ఎండలో కూర్చుని మీరనేక విధములుగ అశాంతికి గురైనటువంటి స్థితి యందు నేను అధికముగా సంభాషించుట అది సరియైన స్థితి కాదని నేను భావించుచూ నా ప్రసంగమును విరమించుచున్నాను.

8-10-78 ఉదయము

ప్రశాంతి పతాకావిష్కరణము

# విగ్రహారాధన

భగవంతుడు సర్వ వ్యాపకుడైననూ, వ్యక్తిగతముగా పొందే నిమిత్తమై అర్చన ద్వారా ఆరాధన కర్మల ద్వారా మానవులు ప్రయత్నింతురు. కొన్ని తెగలవారు. భగవంతుడు ఒక గుడిలోపల ఉంటారా? రాయి, కాయితములలో వుంటారా అని వాదిస్తారు. ఇది సరికాదు. అర్చన పూజ భజనల వలన భగవంతుని పొందుటకు వీలున్నది.

పూజ నిజముగా ప్రథమ సోపానము. ఆహార నిద్రలను మాని అరణ్య మధ్యమందు తపస్సాచరించి దాని ఫలితముగా భగవదనుగ్రహము పొందినవారు బహుమంది యున్నారు. అయితే, పూజ, అర్చన, భజన, సంకీర్తన మొదలగు ఆరాధనా మార్గము సులభమైన మార్గము. మీరాబాయి, సక్కుబాయి, సూరదాసు, కబీర్‌దాసు, శంకరాచార్య వీరందరూ ఈ మార్గమునే అనుసరించి పరతత్వమును అనుభవించి ఆనందించిరి. ఇవంతా నిరుపయోగమైన పనులు దానికి వినియోగించే కాలము వ్యర్థముఅనేవాదము సరిఅయితే వీరందరూ సర్వవ్యాపకమైన భగవత్ తత్వమును ఒక రూపమందు ప్రత్యక్షముగా ఎట్లుచూడగలిగారు ?

అర్చన, పూజ, జపము లేక ఇది సాధ్యముకాదు. ఇంగ్లీషు భాషలోని అన్ని గ్రంథములలోను కనబడేది 26 అక్షరాలే. ఆ అక్షరాలను వ్రాయటము, చదువటము, చెప్పకుండా నేర్చకుండా ఒకరిని ఎట్లు విద్యావంతుడనేది? అర్చన చేసే విగ్రహము కానీ చిత్రము కానీ దైవము యొక్క చిహ్నము మాత్రమే. దైవమును రాయిగా, కాయితముగా మార్చరాదు. సర్వవ్యాపకత్వమైన భగవంతుని హిందువులు ఒక విగ్రహములో చూస్తారంటే హాస్యాస్పదముగా వున్నదని ఆళ్వార్ మహారాజు, స్వామి వివేకానందుని ఎదుట వాదించినాడు. వివేకానంద దానిని విని పక్కున నవ్వాడు. మంత్రిని పిలిచి, గోడపై వుండిన ఆ మహారాజు యొక్క పెద్ద చిత్రమును క్రిందకి తీసిపెట్టమన్నారు. "మంత్రి! ఆ చిత్రముపై ఉమ్మివేయి. క్యాన్‌వాస్ కలర్ తప్ప ఇంకేమి వున్నది దానిలో?" అన్నారు. "అది నీ మహారాజు కాదు" అన్నారు. అయితే మంత్రిగారు భయపడి భక్తి విశ్వాసములతో దాని యందలి అంజలి బద్ధుడై నిలిచాడు. అంతే! ఆ రూపము మహారాజువలే ఆదర్శనీయమే అని అందరూ వివేకానందకు తెలిపిరి సర్వవ్యాపకుడైన భగవంతుడు సర్వత్ర వుండినప్పటికినీ విగ్రహములను ఆధారము చేసుకుని, ఆధేయమును ప్రత్యక్షముగా దర్శిస్తాము.

ఆధారమైన రూపమును పూజించి ఆరాధించి శాస్త్రరీతిగా షోడశోపచారములతో ప్రత్యక్ష స్వరూపముగా భావించితే, తప్పక చిత్తశుద్ధి కలిగి భగవంతుడు అంతఃకరణములో స్పష్టముగా ప్రతిబింబిస్తాడు. అట్లు కాక, అది కాయితము అని భావించిన, ఫలితము కూడ అంతే.

మానవుడు చిత్తశుద్ధికి తగిన కృషి చేయవలెను. మలిన పాత్రయందు మంచి పదార్థము పాకము చేసినపుడు దుర్వినియోగమగును. మంచి విత్తనమును

సారహీనమైన భూమిలో పాతిపెట్టితే లాభము లేదు. చిత్తశుద్ధలేని పూజ కాలము వ్యర్థము చేసిన కర్తవ్యము. అయితే విశ్వాసము, ప్రేమతోకూడిన చిన్న పూజా విధానము ననుసరించిన ఫలితము ఎక్కువ. ఒక గుమస్తాను నియమించే ముందు ఆయన అర్హతను పరిశీలిస్తాము. కలెక్టర్‌గారికి కూడా అనుభవము ఐ.ఎ.ఎస్. ఇత్యాది పరీక్షలలో పాస్ కావటము మొదలైన అర్హతలుండాలి. అట్లనే భగవత్ సాక్షాత్కారమునకు చిత్తశుద్ధి తప్పనిసరిగా వుండి తీరాలి. తిరుత్తొండర్ అనే ఆళ్వార్ చిత్తశుద్ధితో తాను విగ్రహారాధన చేపట్టినట్లు వెల్లడించి యున్నాడు. విగ్రహారాధన చేయునపుడు రూపమును దర్శించాలి కానీ, ఏ పదార్థము అని విచారణ చేయకూడదు. రూపమును వదలివస్తువు, వస్తువులేనిరూపము వుండదు రాయిపై దృష్టినిలిచితే దైవము కనబడదు. దైవముపై దృష్టి నిలిచితే రాయి కనబడదు.

భారతీయులు దైవమును రాయిగా, కాయితముగా ఆరాధించుటలేదు. వారి భావము దైవమే ఆ రాయి అని కాదు. ఈ రాయికూడా దైవమే. అనేదే! ఈ తత్వమును, ఇట్టి సత్యమును గుర్తించి సర్వ వ్యాపకమైన దివ్యత్వమును దక్షిణేశ్వర కాళీ విగ్రహమందు సాక్షాత్కరించుటకు రామకృష్ణ పరమహంసకూడ పూనుకున్నాడు.

ముఖ్యముగా చిత్తశుద్ధి సంపాదించుటకు కాలమును వ్యర్థముచేయక, సత్సంగము, సచ్చింతన, సద్భావము లందే గడపాలి. నిజముగా సత్కర్మలను చేయుట యందే ఆనందము. గీతను బోధించినపుడు కృష్ణుడు అర్జునుని "కురునందన" అనే పేరుతో పిలుస్తాడు. "కురు" అంటే పనిచేయు "నందన" అంటే ఆనందపడేవాడు కురునందన అంటే పనిచేయుటలోని ఆనందమును అందుకునేవాడు. పని లేకపోతే దుఃఖించేవాడు అని అర్థము. మీకు ఆదివారము వచ్చినది అంటే ఆనందము. ఆనందము అయితే, అది Holiday కాదు Holy day.

నిర్మల చిత్తము కలిగిన భక్తులపేరు స్మరించిన చాలు. పంచభూతములు వశమగును. పిడుగు నివారించేకొరకు అర్జునుని తొమ్మిది పేరులు స్మరించేది రూఢి. దానికే త్యాగరాజు, కబీర్ మొదలైన భక్తుల ఆరాధన చేస్తే భగవంతునికి ప్రీతి. చిత్తశుద్ధితో హృదయపూర్వకముగా శరణాగతికి పూనుకోవాలి. అపుడే, వాడు నిజమైన భక్తుడు. అద్దము ముందు నిలుచుకుని, మూడు వ్రేళ్ళను చూపిస్తే దాని లోపల నుండి మూడువ్రేళ్ళు నీకు కనిపించును. "భగవంతుడా! నీకు నా తనమనధనములంతా అర్పితం" అంటే భగవంతుడుకూడా, నీ యోగ క్షేమములను తానే వహిస్తాడు.

దివ్యబోధ,
బృందావనం, 6-2-79.

## సత్ప్రవర్తనతో మంచిగా న్యాయముగా ఉండు.

ప్రప్రథమంగా నీ ఆత్మ అమర్త్యమనీ, దానకి నాశనములేదనీ అది పవిత్రము, నిర్మలము దివ్యమను భావనను నీ చైతన్యంలో నింపుకో. ఆ భావనయే నీకు అచంచల ధైర్య స్థైర్యాల నివ్వగలదు. ఆ తదుపరి నీవు పరస్పర ప్రేమ, భక్తి ప్రపత్తులను పెంపొందించుకో. అన్ని తరహాల వ్యక్తులు, అభిమతాలు, ప్రపత్తులపట్ల సహిష్ణుతచూపు సంబంధ బాంధవ్యాలు భయముపైగాక ప్రియముపై ఆధారపడి ఉండాలి. సత్ప్రవర్తనతో మంచిగా, న్యాయముగా ఉండు.

— బాబా

# సత్యాన్వేషణ - సత్యదర్శనము

భాస్కర బింబే దీప్తం దైవం
లోచనమద్యే సుప్తం దైవం
శీతకర మండల గుప్తం దైవం
త్రి గుగిత భవనే వ్యాప్తం దైవం

సూర్య మండలము నందు ప్రకాశించేటు వంటి దీప్తి దైవస్వరూపము ఈ లోచన మండలము నందు నిద్రించుచున్నటు వంటి దృష్టియే దైవము. చంద్ర మండలము నందు గుప్తముగా దాగియున్నటువంటి శీతలత్వమేదైవము. త్రిగుణితమైనటువంటి బ్రహ్మాండ మంతయు కూడను వ్యాపించినటు వంటిది దైవత్వమే.

ప్రేమస్వరూపులారా!

ప్రపంచము అంతయు కూడాను ఒక్క భగవంతుని యొక్క కుటుంబము భగవంతుని శక్తియె యీ ప్రపంచము నంతను కూడాను భరించుచున్నది. అన్ని యుగము లందును, అన్ని కాలములందును మానవుడు సత్య తత్వమును అన్వేషించుటకై అనేక ప్రయత్న ములు సలుపుతున్నాడు ఈ సత్యాన్వేషణలో అనేక విధములైన మార్గములు కనిపెట్టుతూ వచ్చుచున్నాడు. తాను గుర్తించిన సత్యమును లోకమునకు ప్రచారము సలుపుతున్నాడు. కాని సత్యము ఒక్కటే అయి నప్పటికిని అనేక మంది సత్యమును దర్శించిన మహా పురుషులు అనేక మార్గములను లోకమునకు చాటుతూ వచ్చుచున్నారు. దీనిని పురస్కరించుకొనియె, శ్రుతి "ఏకం సత్ విప్రాఃబహుదావదంతి; ఉన్న సత్యము ఒక్కటే అయినను దానిని దర్శించిన వారు అనేక మంది అనేక రూపనామములతో దీనిని భావించుతున్నారు. సత్యము ఒక్కటే, దర్శనములు అనేకము. దీనికి నామములు అనేకములు.

జలము ఒకే పదార్థము దీనిని ఉత్తరప్రదేశము వారు "పానీ" అని పిలుస్తూ వచ్చుచున్నారు. మద్రాస్ రాష్ట్రమువారు దీనిని "తన్నీ" అని పిలుస్తూ యున్నారు. ఇంకా ప్రాశ్చాత్యులు దీనిని "Water" అంటూన్నారు. కన్నడ దేశమువారు "నీరు" అంటు న్నారు. పండితులు దీనిని "హార్" అంటున్నారు. పేరులు వేరు అయినప్పటికి. పదార్థమును ఎవ్వరు కూడను మార్చుటకు వీలుకానటువంటిది.

ఎన్ని కాలములైనను ఎన్నియుగములైనను మార్పు చెందనటువంటి "సత్" స్వరూపము సత్యము. త్రి కాలముల యందు కూడాను మార్పు చెందనటు వంటిది. ఏ విధమైనటువంటి స్థితిని తాను మార్పు చెందకుండా స్థిరముగా నిలిచినటువంటిదే సత్యము సత్యమనగా క్షీణించనటువంటిది, మార్పు చెందనటు వంటిది, నాశనము కానటు వంటిది. త్రికాలముల యందు కూడాను ఏకస్వరూపమును ధరించినటు వంటిదే సత్యము, సత్యాన్వేషణ అనగా ఆత్మసంబంద మైనటువంటి జ్ఞానమును వెదికేటటువంటి పరిస్థితినే సత్యాన్వేషణ అన్నారు.దీనినే ఏకాంతమై, గాఢమై, పవిత్రమై నిత్యమైవున్నటు వంటి యొక్క "నేను! నేను అనేటటువంటి ఆత్మతత్వమును గుర్తింపచేయు పరిస్థితికే సత్యము అన్నారు. కనుక దృశ్య కల్పిత మైనయీ జగత్ అంతయు కూడాను క్షణ క్షణమునకు

మార్పుచెందుటచేత యిది సత్యమని చెప్పుటకు వీలు కాదని మనయొక్క శృతులు, స్మృతులు తెల్పు చున్నది. దీనినే అసత్యమని చెప్పవచ్చును. కనుక మార్పు చెందుతూ – నాశనము అగుతూ – క్షీణిం చుతూ, ఉన్నటువంటి ఈ జగత్తు సత్యము కానేరదని మనకు స్పష్టమగుచూ వచ్చినది.

కనుకనే సత్యాన్వేషణయందు, భగవత్ సాక్షా త్కారము పొందేటటువంటి ప్రయత్నమునకై మన పవిత్రమైన ప్రాచీనులైన మహర్షులు అనేక విధము లైన సాధనలు సలుపుతూ వచ్చినారు. ఈ యొక్క సత్య స్వరూపుడైన భగవంతుని మేము గుర్తించి నాము అని కూడను ప్రపంచమునకు చాటినారు.

వేదాంతమ్ తత్ పురుషం మహన్తం
అదిత్యవర్ణం తమసః పరస్తాత్.

అన్నారు. ఓ జనులారా! మేము సత్యస్వరూపుడైన పరమాత్మను దర్శించినాము. దివ్యతేజస్సుతో ప్రకా శించుచున్నటువంటి మహాపురుషుని దర్శించు కొందుము. ఎక్కడ దర్శించుకొనినాము? వెలుపల ప్రపంచమునందు కాదు. మా హృదయ స్థాయినందు మా అంతరాత్మయందు తేజస్వరూపుడైన పరమాత్మను దర్శించుకొనినామని యీ మహాపురుషులు ప్రపంచము నకు చాటినారు.

కనుక సాక్షాత్కారమనగా మనము అనేక రకము లైన ప్రయత్నములు సలిపి ఏదో ఒక నూతనమైన పదార్థమును సాధించినట్లుగా మనం భావించుతున్నాము సాక్షాత్కారమనగా ఏదో నూతనమైనటువంటి దానిని మనము సాధించేటటువంటి ప్రయత్నము కానేరదు. మనయందు నిరంతరము వుండి, మనచే మరువబడిన దివ్యత్వమైన స్థితిని, ఆస్తిని, పవిత్రతను, మనము గుర్తించుకొనుటయే సాక్షాత్కారము యొక్క అంత రార్థము. మరువబడినటువంటి యీ నిధిని, పవిత్ర మైన పెన్నిధిగా భావించి, సన్నిధిగా విశ్వసించి, దీని నిమిత్తమై మనము లో దృష్టిని అభివృద్ధి పరచు కొనుట అత్యవసరము. అయితే మరువబడినటువంటి యీ నిధిని గుర్తించుకొనే నిమిత్తమై ప్రత్యక్ష ప్రమా ణమైనటువంటి కొన్ని స్వరూప స్వభావములను మనము కొంత ఆదర్శముగా తీసుకొనుట అత్యవ సరము.

ఆధ్యాత్మిక క్షేత్రమునందు ప్రాచీన కాలమునుండి విగ్రహారాధన ఒక సాంప్రదాయ పద్ధతిలో సాగుతూ వచ్చుచున్నది. కాని విగ్రహారాధనను ఖండించి యిది సరియైన మార్గము కాదనియు దైవము సర్వాంతర్యామి అనియు, అన్నివైపుల ఉన్నటువంటి పరమాత్మను గుర్తించుకొనక అతనిని ఒక సంకుచిత స్వరూప ముగా నిరూపించుట యిది సరియైన మార్గము కాదనేటు వంటి వాదన కూడనూ మరొకవైపు సాగుచున్నది. అనేకమంది మహనీయులు, యీ సందిగ్ధావస్థలో మునిగి, అనేక సాధనలు సలిపి, అనేక శ్రమలకు ఓర్చి, ఏదో ఒక విధముగా ఒక ఆరాధన రూపమును వారు నిర్మించుకొని, తద్వారానే వారు ఆనందమును అనుభవించినారు. విగ్రహారాధన సలుపక ఆత్మా నందము అనుభవించుట అసాధ్యమైన పని.

ఆంధ్ర భాషయందు ఏబది అక్షరములు ఉంటు న్నవి. ఈయొక్క ఏబది అక్షరములు కూడాను ముఖ్యముగా వ్రాయుట పలుకుట, చదువుట, యీవిధ మైనటువంటిది నేర్చుకొనిన తరువాతనే పుస్తకమును పఠించుటకు వీలవుతుంది. ఇది వ్రాయుటము, చదువు టమే వారికి తెలియకుండినప్పుడు యీ పుస్తకములు పఠించుట జరిగేపనికాదు. అదే విధముగానే మన యొక్క ఆరాధనలు ఒక స్వరూపమును మనము నిర్మించుకొని, దానిని మనస్సునందు స్థాపించుకొని

'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అని మనము నిర్మించుకొనిన స్వరూప స్వభావమునే మనలో ఆవిర్భవించుకొనుటకు ఒక విధమైన సహాయకారిగా తోడ్పడుతూ ఉంటుంది, మహాజ్ఞానుడైనటువంటి, పవిత్రుడైనటువంటి, విద్యావంతుడైనటువంటి, దివ్యతేజోవంతుడైనటువంటి, కారణజన్ముడైనటువంటి శంకరాచార్యులు వారుకూడను యీ విగ్రహారాధనను ప్రధానమైన లక్ష్యముగా తాను గుర్తించి, ఆ విధముగా ఆరాధన చేయుచు వచ్చెను. ఇంక రామకృష్ణ పరమహంస, వివేకనంద, త్యాగరాజు, దామదాసు, తుకారామ్ యిలాంటి మహనీయులు, మహాభక్తులు అందరు కూడను, ఆరాధననే ఆధారముగా చేసుకొని ఆత్మ తత్వమును అనుభవించినారు. క్షరము లేక అక్షరమును గుర్తించుట, యిది అసాధ్యమైన పని. అనగా మార్పు చెందేటటువంటి యీ జగత్తును ఆధారముగా చేసుకొని, మార్పు చెందనటువంటి సత్య స్వరూపుని దర్శించుట, ఇది సులభ సాధ్యమైన పని. అయితే ఏదో కొంతమందికి, కారణ జన్ములకు మాత్రము ఇట్టి ఆరాధనలు అవసరము ఉండదు.

మన పవిత్రమైన భారతీయ చరిత్రల యందు అనేకమంది తపస్సులు ఆచరించి, మహాజ్ఞాన సంపన్నులైనటువంటి వారికంటే కూడను, భక్తులై ఆరాధనలు సలిపి, భగవంతుని భజించి, స్మరించి, పూజించి, అర్పించి, ఆరాధించి, ఆత్మానందమును పొందినటువంటి వారు అనేకముగా కనిపించుతున్నారు. ఇది ప్రత్యక్ష ప్రమాణమునకు నిరూపించినటువంటి ఆనందము, పదోయోగులు, జ్ఞానులు అయినటువంటి వారు, వారి తత్వమును ఎవ్వరు కూడను వర్ణించుటకు కాని, గుర్తించుటకు గాని సాధ్యము కాని పని. సామాన్య మానవులకు సహజమైన మార్గమును, సులభమైన మార్గమును అవలంబించుటకు ఆరాధన అత్యవసరము. దీనికి చిత్తశుద్ధి ప్రధానము. ఇదే దీనికి తగిన ప్రమాణము. మనము యీ ఆరాధనలను ప్రథమ స్థాయిని మనము ఏ మాత్రము అంగీకరించక, ఏదో ఒక విధమైన ఉన్నత స్థాయిని పొందుట, ఇది వెర్రితనముగా గోచరించును. ఇది ఎట్లు ఉండుననగా **B. A. Pass** అయినటువంటి విద్యార్థి ఇతను **B. A.** అని చెప్పుట చేత సహజముగా యితను **School Final, P. U. C. pass** అయినాడని సులభముగా మనకు అర్థమవుతుంది. ఇది ఒక ఫలము అని మనము నిరూపించుటకు పూర్వము, ఇది కాయగను పిందెగను ఉండి తరువాతనే ఇది ఫలముగా మారినదని ఈ ఫలమునకు పూర్వము ఉన్నటువంటి పిందె, కాయ మనము సహజముగా గుర్తించుటకు వీలవుతుంది. పిందె, కాయ కాక, ఫలము అగుటకు వీలుకాదు. **School Final, P. U. C.** కాకుండ **B. A.** చదువుటకు వీలుకాదు. ఇతడు యువకుడని చెప్పినప్పుడు, బాల్యము, కౌమార్యము ఇందులో పూర్వము ఉండునని స్పష్టముగా మనకు గోచరమవుతుంది. ఇతను బాల్యవస్థను, కౌమార్యమును అనుభవించక యువకుడు కావటమునకు సాధ్యము కాదు.

కనుకనే మనము ఆత్మ సాక్షాత్కారమునకు పూర్వము ఒక విధమైన రూపమును ఆరాధించుట యిది అత్యవసరము. యీ ఆరాధన ద్వారానే భావశుద్ధి, భావశుద్ధి ద్వారానే చిత్తశుద్ధి, చిత్తశుద్ధి ద్వారానే జ్ఞానశుద్ధి మనకు లభించును. అనగా మన అంతర్ భాగములో ఉండినటువంటి, మనము మరచినటువంటి విధిని మనము జ్ఞాపకము చేసుకొనుటకు దేహరీతియైన శ్రమలకు ఓర్చి దేహరీతితో కొన్ని రకములైన సత్ కర్మలు ఆచరించి, ఆరాధనలు సలిపి తద్వారా మనసుయొక్క స్థిరత్వమును కొంతవరకు తెప్పించుకొనుటకు ప్రయత్నము చేయవలెను. మలినపాత్ర

యందు వండినటువంటి పదార్థమంతయు కూడను మాలిన్యముగానే రూపొందును. ఇది కేవలము నిరుపయోగముగా కూడను రూపొందుతుంది. పరిశుద్ధమైన పాత్రలో వండిన పదార్థము పవిత్రము. భుజించుటకు వీలవుతుంది. అదే విధముగానే మన హృదయమునందు అనేక విధములైన మాలిన్యములు చేర్చుకొనినప్పుడు తద్వారా దివ్యాత్మయైన ఆత్మతత్త్వమును గాని, సత్య స్వరూపమైన అగమ్యాగోచరమైన విధిని గాని అనుభవించుటకు సాధ్యము కాదు. కనుక మనము ఎట్టి సాధనలు చేయకపోయినను, ఎట్టి తపస్సులు ఆచరించకపోయినను ఎట్టి విధములైన యజ్ఞయాగాదిక్రతువులు సలుపక పోయినప్పటికిని General Qualification, Purity చిత్తశుద్ధి యిది అందరకును అవసరమే.

కనుక దీనిని పురస్కరించుకొనియే, ఆధ్యాత్మిక మార్గమునందు మల, నిక్షేప, ఆదరణ పరిశుద్ధులు కావాలని ప్రబోధిస్తూ వచ్చినారు. అనగా మనము దేహరీతిగా సలిపేనటువంటి సత్కర్మల చేతను, సత్ ప్రవర్తనల చేతను, సదాచారముల చేతను- సత్ కార్యముల చేతను సర్వేశ్వరుని ఆరాధన చేతను మాలిన్యము అనేటటువంటిది మలము పరిశుద్ధముగా మారిపోతుంది. అనగా అశుద్ధమైన మాలిన్యము మరుగ పడిపోతుంది. నిర్మూలము అవుతుంది. ఇంకా 'నిక్షేపము'' నిక్షేపము అనగా మనము మానసికముగా సలిపేటటువంటి చింతనల ఉపాసనలు, పూజలు, ధ్యానము వీటిద్వారా నిక్షేపము పరిశుద్ధముగా మారును. అప్పుడు చిత్తశుద్ధి అను జ్ఞానము మనకు కలుగుతుంది. జ్ఞానము ఏదో గ్రంథముల ద్వారాగాని, మనము అందుకొనేటటువంటి పదార్థము కాదు. మర్రికాయ లోపల విత్తనమువలె, మనలో జ్ఞానము విత్తనపు స్వరూపమును ధరించి ఉంటున్న ఈ విత్తనము మనము మల, నిక్షేప, ఆదరణ పరిశుద్ధములు చేసుకొనిన తరువాత, క్రమక్రమేణ ఇది అభివృద్ధి చెందవచ్చును. ఇదియే బ్రహ్మాండమైన పెద్ద వృక్షముగా రూపొందుతుంది. దీనిని పురస్కరించుకొనియే శ్రుతులు.

"అణోరణీయాన్, మహతో మహీయాన్" అనగా మర్రికాయ లోపల ఉన్న విత్తనము చీమ తల లోపలి పదింటి ఒక భాగముగా ఉండును. ఇది చూచుటకు కూడను, సాధ్యము కానటువంటి స్వరూపమును ధరించి ఉంటుంది. కాని అట్టి అణుస్వరూపమును ధరించిన విత్తనమే ఘనస్వరూపముగా రూపొందుతుంది. ఈ ఘనవృక్షము అణువునందే అణిగి ఉంటున్నది పూర్వము కనుకనే ఏకత్వమనికాని అద్వైత దర్శనము అనేటువంటి జ్ఞానతత్వముకాని, యీ అణుత్వమైనటువంటి హృదయాంతరాళమునందు మాత్రమే అణుస్వరూపమును ధరించి ఉంటున్నది.

మనము చేసేటటువంటి సర్వసాధనలు కూడను, ఈ అణుస్వరూపమైన జ్ఞానమును పెంపొందుకొనుటను మనము గుర్తించవలెను. దివ్యాత్మ స్వరూపులారా ! ఇట్టి పవిత్రమైన పారమార్థిక మార్గములను, చర్యలను, దివ్యమైన బోధనలు ఇముడ్చుకొని వచ్చినటువంటి చరిత్రలు మహా పవిత్రమైన చరిత్రలుగా మనము విశ్వసించవలెను. ఇవి ఎప్పటికప్పుడు క్రొత్తవిగా కనిపించును. పురాణములు ఏదో కృతయుగ, త్రేత యుగ, ద్వాపరయుగములందు జరిగినటువంటి పురాతన చరిత్రలు మాత్రమే అని భావించుకొనుట, ఇది సరైనటువంటిది కాదు. పురాణములు పురాతనమైనప్పటికిని ఎప్పటికప్పుడు క్రొత్తవిగా రూపొందును. ఇవి ఎప్పుడుకూడను చాలా స్వేచ్ఛగా, కళకళలాడుతూ ఉండును. ఇలాంటి పురాణములయందు వచ్చినటువంటి సాధనలను మనము నిర్లక్ష్యము చేసి,

అలక్ష్యము చేసి ఏదో మనకు తెలియనటువంటిది, అసాధ్యమైనటువంటిది. దానిని అందుకొనే నిమిత్తమై అనేక సాధనలు చేయుచున్నామని భావించుకొనుట ఇది అజ్ఞానము యొక్క లక్షణము.

దురదృష్టవశాత్తు కొంతమంది ప్రాచీనమైన అనుభవజ్ఞులు. ఇట్టి సత్యాన్వేషణ అనేటువంటి మార్గమునకు సరియైన అర్థము తెలియకపోవుటచేత, ఏదో సాక్షాత్కారము అంటే; కనటం వంటి వస్తువును, మనకు అతి దూరముగానున్న వస్తువును, మనలో కనటం వంటి తత్వమును తెలిసికొనుటకు, కనుగొనుటకు, అందుకొనుటకు నూతనముగా ప్రయత్నములు సలిపినట్లుగా మనము భావించుతున్నాము. ఇదియే పెద్ద పొరపాటు. మన జీవితముయొక్క లక్ష్యము సత్యాన్వేషణయే, సత్యదర్శనమే. సత్యమనగా చూసినది చూసినట్లు చెప్పుటయు; వినినది విన్నట్లు చెప్పటము; చేసినది చేసినట్లు చెప్పటము. ఇది కేవలము వాక్కుల సత్యముగానే కనిపించుచున్నదేకాని, ఇది సాక్షాత్తు సత్యస్వరూపము కానేరదు. ఆత్మతత్వమే సత్యతత్వము; సత్యం, సత్యం అంటే ఏమిటి? సత్యం జ్ఞానం అనంతం. అనంతమైనటువంటిది. జ్ఞానస్వరూపమైనటువంటిది. ఈ సత్యం భౌతిక లోకమునకు చూసినది చూసినట్లుగా చెప్పటము; వినినది విన్నట్లుగా చెప్పటము; చేసినది చేసినట్లుగా చెప్పటము ఇది భౌతికమైన సత్యముగా మనము భావించుకొని, యిదీ మిథ్యం మిథ్యముగా నిరూపించుతూ రావలెను.

ఈ సత్యము ఎలాంటిదనగా మనము ఒక సినిమాకు వెళ్ళినాము. ఈ సినిమా మిథ్యమైనటువంటిది. ఈ సినిమాయందు సాక్షాత్తు మానవత్వము అక్కడ మనకు గోచరించదు. ఇది కేవలము కాలక్షేప నిమిత్తమై ఏదో ఒక విధమైన మానసిక విశ్రాంతికొరకని. Knowledgeను పెంచుకోవాలని, ఎన్నియో రకములైన మాటలతో దీనిని చూడటానికి వెళ్ళేటటువంటి వారు సమర్థించే మాటలు ఉపయోగపెడతారు. ఈ సినిమాలోపల డబ్బులు నిమిత్తం అనేకమంది actors అక్కడ ఏ రకముగా ఏడుస్తారు. డబ్బులు కోసము actors ఏడిస్తే ప్రేక్షకులు డబ్బు ఇచ్చి ఏడుస్తున్నారు. నిజముగా ఆ యొక్క తెరపైన ఎవ్వరు ఏడ్చుటలేదు. ఇది మిథ్యమైనటువంటిది. అయితే యీ సినిమాలో మరియొక సినిమాను చూచుటకు బయలుదేరుతున్నాము. అనగా ఏమిటి? ఈ సినిమాలో ఉన్న కథ లోపల ఏదో కొంతమంది Friends, ఈ సినిమాలోపలనే ఒరేయ్, సినిమాకు వెళ్ళుదామని, సినిమాలోనే మరియొక సినిమా చూచుటకు బయలుదేరి వెళ్ళుచుంటారు. కనుకనే దీనిని మిథ్యములోని మిథ్యము అన్నారు.

జాగ్రత్ అవస్థ అంతయు సత్యములోని మిథ్యము అన్నారు. అనగా మనము అనేక దృశ్యములు చూచుచున్నాము. దృశ్య కల్పితమైన ప్రపంచమును మనము అనుభవించుచున్నాము. ఇది అనుభవించుతున్న వరకు సత్యముగానే గోచరించును. కాని కొంత కాలములో యిది అదృశ్యమైపోతున్నది. ఇది మార్పుచెందుతున్నది. క్షీణించుతున్నది. నశించుతున్నది, నాశనమొందుతున్నది పరిణామాలు పొందుతున్నది. కనుక యీ షడ్వికారతత్వములతో కూడిన జగత్తు, సత్యము, సత్యము అనిభావించుతూ కొంత కాలము లోపల అది అసత్యముగా మారిపోతుంది. కనుకనే దీనిని సత్యములోని మిథ్యము అన్నారు అయితే యిది సత్యమని చెప్పుటకు ఏట్లా వీలవుతుంది? సర్వము భాగవత్సంకల్పమే. భగవత్ సంకల్పము నుంచి వచ్చినటువంటిది. సర్వము, సత్యమే కనుకనే యీ దృష్టిలోపల యిది సత్యము అని విశ్వసించవలెను. "రసోవైసం" సర్వమును

రసము నుంచి వచ్చినటువంటిది నీ ర స ము గా రూపొందుతుందా? కాదు, కాదు రసము నుంచి వచ్చినటు వంటిదే రసమే. కనుకనే బ్రహ్మనుంచి వచ్చినటువంటిది స ర్వ ము ను బ్రహ్మనుంచి గానే ఉంటుంది. కనుక యిది సత్యమే ఈ సత్యము లోపల మిధ్యమైన దృశ్యమును కొంత వరకు భావించుతున్నాము.

సర్వసృష్టి కూడను దృష్టి నుంచి ఏర్పడిన నటు వంటిదనే సత్యమును గుర్తించటము అత్యవసరము యీనాడు. ఒకచిన్న ఉదాహరణము నేను కన్నులు తెరచినప్పుడు వేలాది ప్రజలందరు కనిపించుతున్నారు. ఈ ఆడిటోరియమంతయు కనిపించుచున్నది. ఈ స్థంభములన్ని చక్కగా అలంకరించబడి కనిపించుచున్నవి ఇన్ని వేల మంది కన్నులు తెరచినప్పుడు వేలాది ప్రజలతో కూడిన ప్రపంచమును చూడటము, కన్నులు మూచినప్పుడు ఒక్కరైనా అందులో కనిపించక పోవటములో ఉన్న అంతరార్థము ఏమిటి? దృష్టి వలననే యీ సృష్టి అంతయు కనిపించుచున్నది. దృష్టియే లేకపోతే సృష్టియు లేదు. కనుక యీ దృష్టిలో ఉండినటువంటి బ్రహ్మతత్వమే సర్వసృష్టిని కూడను గోచరింప చేయుచున్నది. అదియే ఒక మిధ్యము దృష్టియే సత్యము లోచన మిధ్యేసుస్తం దైవం, మన కన్నుల లోపల చక్కగా నిద్రించుచున్నటు కనిపించే దైవత్వము. యీ జగత్తునంతను ఒక మి ధ్య ము గా మనకు కనిపింపచేయుచున్నది. కనుక మన దృషిబ్రహ్మము, సృష్టిమిధ్యము, కనుకనే మిధ్యములోని సత్యమును, సత్యములోని సత్యమును మిధ్యములోని మిధ్యమును యీ మూడింటి ద్వారా గుర్తించుకొనుటలో, సత్యములోని సత్యమును గుర్తించుటయే మానవుని యొక్క ప్రధానమైన కర్తవ్యము.

అనగా సినిమాలో మరియొక సినిమాలు చూడటము మిధ్యములోని మిధ్యము. సృష్టిలో ఉన్నటు వంటి సత్యమును చూడటము ఇది మిధ్యములోని సత్యము. ఆత్మస్థాయి యందు ఉన్నటువంటి పవిత్రమైన సత్యమును, లోదృష్టి ద్వారా మనము సందర్శించుట సత్యములోని సత్యము. దీనినే ఉపనిషత్తులు "సత్యస్య సత్యం" అన్నారు. కనుక ఏదో మనము మానవులుగా పుట్టి, పవిత్రమైన మానవజన్మము ఎత్తి, యీ దుర్లభమైన జీవితమును అనుభవించుతూ అసత్యమైన, అశాశ్వతమైన, అనిత్యమైన. జగత్తునకై మనము ప్రాకులాడక, దానిని సాధ్యమైనంత వరకు కూడను, మనలో సత్యమును గుర్తించుకొనే ప్రయత్నమును అభివృద్ధి పరచుకొని, సత్యస్వరూపిని గుర్తించుటకు ప్రయత్నము చేయవలెనని నేను ఆశించుతూ, ఆశీర్వదించుతూ నా ప్రసంగమును విరమించుచున్నాను.

## ఉచ్చస్థాయి యందు ఉల్లముంచు

ప్రతివాడును ఉచ్చస్థాయియందే యుల్లముంచి, తానాత్మయే యనుకొని, యాత్మధర్మమును అనుసరించుటయే శ్రేయము. ఈ విషయమును లోకమునకు బోధించుటకే నేను వచ్చినది.

—బాబా

# అవతారమూర్తి

సీ॥ చిన్నారి పొన్నారి చిరునవ్వులొలుకుచు
పాపలలో చిన్నిపాపగుచు,
ముగ్ధమోహన దివ్యమూర్తిమత్వము తోఁడ
సతులలో నకలంక సతివియగుచు
పరిపూర్ణ పరిశుద్ధ భావహావములతో
పురుషులలో దివ్యపురుషుడగుచు
తలచిన రూపుతో దర్శనం బొసఁగుచు
ఏకాంతమున పరమేశుడగుచు

తే॥ గీ॥ శాంత్య హింసాది సుగుణ ప్రచారివగుచు
భక్త హృదయాంతర ప్రభా భానుడగుచు
ధర్మ సంస్థాపనార్థ మీః ధరను వెలయు
సర్వదేవత రూప శ్రీ సత్యసాయి.

సి. సత్యనారాయణరాజు

## SANATHANA SARATHI (Telugu Edition)

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Prasanthi Nilayam 515134<br>Anantapur District, Andhra Pradesh |
| 2. | Periodicity of its Publication | Monthly |
| 3. | Printer's Name<br>(Whether citizen of India)<br>Address : | B. V. Satya Murty<br>India<br>B,68/F.5, Vijayanagar Colony<br>Hyderabad-500 028. A.P. |
| 4. | Publisher's Name<br>(Whether citizen of India)<br>Address : | N. Kasturi, M.A.,B.L.,<br>India<br>Prasanthi Nilayam, PO. 515 134<br>Anantapur Dist. Andhra Pradesh |
| 5. | Editor's Name<br>(Whether citizen of India)<br>Address : | N.Kasturi, M.A., B.L.,<br>India<br>Anantapur District, Andhra Pradesh |
| 6. | Name and addresses of individuals who own the newspaper or share-holders holding more than one percent of the total capital | Sri Sathya Sai Education and Publication Foundation,<br>Prasanti Nilayam PO. 515 134<br>Anantapur District, Andhra Pradesh |

I, N. Kasturi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

N. KASTURI, M.A.,B.L.,
Signature of Publsher,

# రెండు కానులు

1976 అక్టోబరు నెలలో ఒకరోజున లైబ్రరీనుంచి "ప్రశాంతి నిలయము" అనెడి నవలను తెచ్చి చదివాను. కథలు చాలా బాగున్నవి. పుస్తకము ఆఖరున ప్రశాంతి నిలయము ఎక్కడో దూరముగాలేదు. అనంతపురమునకు 60 మైళ్ళలోవున్నది అని చదివాను. రచయిత బి. వి. రమణరావు, ప్రశాంతి నిలయము గురించి పూర్తిగా తెలుసుకోవాలని మా తమ్ముడు నేను నిర్ణయించుకున్నాము. దరిదాపుల 14 సంవత్సరముల నుంచి నిలయము వెళ్ళుచున్న ఒక ప్రియమైన స్నేహితుడు మాకు వున్నాడు. పేరు యమ్ భాస్కరరావు. ప్రశాంతి నిలయము గురించి పూర్తిగా తెలుసుకోవాలని వుంది కనుక మీకు కాళీ వున్నప్పుడు వివరముగా చెప్పవలసినది అని కోరాము. దరిదాపుల మూడు నెలలు ప్రతిరోజు సాయంత్రము 3 గంటలసేపు నిలయము గురించి స్వామి గురించి నిదానముగా అర్థమయ్యేటట్లు చెప్పాడు. స్వామిని గురించి వున్న పుస్తకములు చదవటానికి ఇచ్చెడివాడు. నిలయము గురించి కొంత అర్థమయింది. నిలయము దర్శించాలని ఒక బలమైన కోర్కె ఏర్పడింది.

1977 జనవరి ఒకటవ తారీకున భాస్కరరావు, మేము స్వామిని ఉదయము భజన సమయమున చాలా దూరమునుంచి మొదటిసారిగా దర్శించాము. ఈ రోజు వైకుంఠ ఏకాదశి; మొహరము; జనవరి ఒకటి; కనుక నిలయము అన్ని మతస్థులతో కళకళలాడు చున్నది. మేము స్వామిని ఒక ప్రశ్న అడగాలని వచ్చాము; మేము కష్టపడి వ్యవసాయము చేయుచున్నాము; ప్రకృతి ఎందులకు పంటను నాశనము చేయుచున్నది? ఇది ప్రశ్న. స్వామి దర్శనమే చాలా కష్టముగావుంది; ఇక ప్రశ్న ఎవరిని అడగాలి.

సాయంత్రము 5 గంటలకు నిలయములో స్వామి దివ్యోపన్యాసము వినటానికి కూర్చున్నాము. స్వామిని దగ్గరగా దర్శించి చాలా ఆనందము అనుభవించాము. మా ప్రశ్న మా మనసులోనే వున్నది. స్వామి ఈరోజు ప్రకృతి గురించి వుపన్యసించారు. "ప్రకృతి భగవంతుడు ఇచ్చిన ఆజ్ఞలను నిర్వర్తిస్తుంది. స్పీడుగా వెళ్ళుచున్న కారుకు చిన్న గొయ్యి అడ్డము వచ్చినదని సడన్ బ్రేక్ వేస్తే కారులోని వారందరు తల్లక్రిందులు అవుతారు. కారుని అదే స్పీడులో పోనిస్తే కారుకి చిన్న కుదుపువస్తుంది, కాని ఎవ్వరికి ప్రమాదము వుండదు. అలాగే ప్రకృతిని ఒక్కసారే ఆపితే జరగవలసిన దానికన్న ఎక్కువ ప్రమాదము జరుగుతుంది. సముద్రములో ఒక నీటిబొట్టు అంత ప్రకృతి గురించి తెలుసుకొని, ప్రకృతి అంతా తెలుసునని భావించుచున్నారు. రావణాసురిడిలాగా ప్రకృతి అయిన సీతాదేవి కావాలంటున్నారు; పురుషుడు అయిన రాముడు కూడ కావాలని కోరటములేదు. కనుక మీరు కర్మ చేయండి; ఫలితమును భగవంతునికి అర్పించండి. పంచ భూతములకు శాంతి చేకూర్చండి; అప్పుడు ప్రకృతి మిమ్ములను కాపాడుతుంది, అని చెప్పారు. మేము కర్మ చేయుచున్నాము; కాని మిగిలినది చేయుట లేదు. స్వామిని అడగకుండానే మా ప్రశ్నకు సూటి

అయిన సమాధానము దొరికినది. మొదటి సారిగా స్వామితో మనసుతో మాట్లాడవచ్చని తెలుసుకున్నాం.

ఒక దినము తెల్లవారుజామున స్వామికలలో కనిపించి కొంతసేపు మాట్లాడిన తరువాత ఏమి కావాలని అడిగారు; జ్ఞానాన్ని ప్రసాదించమని కోరాను. తరువాత స్వామిని గూర్చి; పూర్వపు అవతారమయిన షిరిడీ సాయిని గూర్చి కొన్ని పుస్తకములు చదివాము స్వామి అనుగ్రహముతో షిర్డి దర్శించాము. అక్కడ కూడ మాకు కొన్ని నిదర్శనలు దొరికినవి. వారే వీరు, వీరే వారు అని నిర్ణయించికున్నాము. ఒకరోజున పితృ సమానులయిన P. విశ్వనాధ శర్మగారిని మా తమ్ముడు మా గృహమునకు తీసుకువచ్చాడు. రెండు అవతారములు ఒకటేనని మాకు దృఢనిశ్చయము కలిగేటట్లు వివరించారు. స్వామిని గూర్చి ఆలస్యముగా తెలుసుకున్నామని బాధపడవద్దు; రామాయణములో ఆంజనేయుడు రాముడిని అందరికన్న ఆలస్యముగా కలుసుకున్నాడు; కాని అందరిని మించిన రామభక్తుడు అయ్యాడు. కనుక స్వామి అనుగ్రహము సంపాదించుటకు కృషిచేయండి, సమితిలో చేరండి అని మమ్ములను ప్రోత్సహించి; ఆశీర్వదించి వెళ్ళారు. అప్పటి నుంచి మా చిన్న కుటుంబము అంత వారే వీరు అని నమ్మి; భక్తరేణువులలో ఒక రేణువుగా మారాము.

అప్పటినుంచి స్వామి కరుణవలన ప్రకృతి మమ్ములను నష్టపరుచుటలేదు. స్వామి అనుగ్రహముతో, 1978లో, జిల్లాలో నాకు ఒక బెస్ట్ రైతుగా బహుమతి వచ్చినది. వచ్చిన బహుమతి మురళీధరుని కంచు విగ్రహము. స్వామి ఈ రూపముగా తన విగ్రహాన్ని మాకు ప్రసాదించారని సంతోషించాము.

1978 జనవరి నెలలో ఒకరోజున స్వామి కలలో కన్పించి; "నాలుగు నెలలు వ్యవసాయము గురించి ట్రైనింగుకు ఇతర దేశాలు వెళతావా?" అని అడిగారు. "నాకు రికమెండు చేసే రాజకీయ నాయకులు ఎవ్వరు లేరు స్వామీ" అని అన్నాను. "సర్వ సృష్టికి ఇచ్చేది వాడను నేను"; అని అన్నారు. "మీ దయ" అని అన్నాను.

ఫిబ్రవరి నెలలో సోదరి భారతిదేవి "మనదేశము నుంచి రైతులను ఇతరదేశము పంపించుచున్నారు, కనుక నువ్వు అప్లై చెయ్యవలసింది. అని అప్లికేషను ఫారములు; ఉత్తరము, పోస్టులో పంపించినది. సరిగ్గా అది శివరాత్రి. స్వామి అనుగ్రహముగా భావించి అప్లైచేసాను. వ్యవసాయపు డిపార్ట్‌మెంటువాళ్ళు "ఇది 30 సంవత్సరముల క్రితము మొదలు అయినది; చాలా మంది చాలా పెద్ద రికమెండేషన్సుతో Try చేసారు; మాకు తెలిసివుండగా ఎవ్వరు సెలక్ట్ అవ్వలేదు; కనుక అప్లైచేయుట అనవసరము" అని చెప్పారు. అప్లైచేసిన వెంటనే షిర్డిసాయికి; సత్యసాయికి టెలిగ్రామ్సు ఇచ్చాను. ఒకసారి సత్యసాయిని దూరము నుంచి దర్శనము చేసుకున్నాను. ఇంటర్వ్యూకి వెళ్ళే ముందు కలలో షిర్డిసాయి, సత్యసాయి ఇద్దరు కనిపించి ఆశీర్వదించారు. May నెలలో ఇంటర్వ్యూకి వెళ్ళాను. May 30వ తారీఖు ఆఖరు తేది. తరువాత నాకు ఏ సమాధానము రాలేదు. June లో కూడ ఏమి రాలేదు. కనుక నేను సెలెక్టు అవలేదు అని అనుకున్నాను.

ఇంతకుముందు వచ్చిన కలలు అన్ని నా భ్రమలు, నా మనసులోని కోరికలు నా కలలుగా వచ్చుచున్నవి: స్వామి ఏదన్న చెప్పాలంటే ఇంటర్వ్యూ ఇచ్చి Direct గా చెప్పుతారు; కనుక ఇది అంతా నా భ్రమ అని వూరుకున్నాను. ఇక ఈ విషయము పూర్తిగా వదిలివేసి, వ్యవసాయపు పనులు చూసుకొనుచున్నాను.

అక్టోబరు 7వ తారీఖున, "నేను సెలక్టు అయినట్లు, 21వ తారీఖున విదేశము బయలు దేరవలసింది" అని టెలిగ్రాము వచ్చినది. అంత స్వామిలీల. మొత్తము భారతదేశము నించి 4 వేలమంది అప్లైచేసాము. ఇందులో అయిదుగురుము మాత్రము సెలక్టు అయినాము. నేను ప్రథముడిని. మా మొత్తము ఖర్చులు విదేశపు గవర్నమెంటు భరించుచున్నది. అందుకని ఇన్నిరోజులు ఆలస్యము అయినది.

"నీవు నాకు రెండు కానులు దక్షిణ ఇవ్వ" (1) దృఢమైన నమ్మకము; (2) ఓర్పు; నాతరువాత కూడ నా బొమికలు మాట్లాడతాయి; నేను ఈ ప్రపంచములోని సర్వ జీవరాశియందు వున్నాను; నేను షిర్డిలోనే వున్నానని తలంచేవాడు నా భక్తుడుకాడు; నా ఖజానాలో ధానము చేయుటకు చాలా ధనమున్నది; కాని నీవు దానము పొందుటకు అర్హత సంపాదించు" అని షిర్డిసాయి అన్నారు. "దృఢమైన నమ్మకముతో నా వద్దకు వచ్చేవరకు నీవంతు; తరువాత నిన్ను కాపాడుట నావంతు; నీ బరువు మొత్తము నా మీద వదులు నేను మోస్తాను;" అని సత్యసాయి అన్నారు. ఇప్పుడు నేను ప్రశాంతి నిలయమునకు దరిదాపుల 14 వేల మైళ్ళ దూరములో వున్నాను; సాయీ! అంటే ఓయీ! అంటూ కంట, వెంట, జంట వుంటూ నాకు అన్ని విషయములలో సహాయము చేయుచున్నారు. కనుక అందరు రెండు కానులు స్వామికి దక్షిణగా అర్పించి; స్వామి అనుగ్రహముతో అనంతమయిన ఆనందము పొందుతారని ఆశించుచున్నాను.

ఒక భక్త పరమాణువు

# ప్రకటన

సత్యసాయి సంస్థల ప్రపంచ సమితి 1979వ సంవత్సరములో ఈ క్రింది ఉత్సవములను జరుపుటకు నిర్ణయించినది.

| | | |
|---|---|---|
| 1. | ఈశ్వరమ్మ వర్ధంతి | మే. 6వ తేది (ఆదివారం) |
| 2. | సేవాదళ్ వార్షికోత్సవం | సెప్టెంబర్ 23వ తేదీ (ఆదివారం) |
| 3. | అఖండభజన | నవంబర్ 10వ తేదీ శనివారం ప్రారంభం<br>11వ తేదీ ఆదివారం సమాప్తి |
| 4, | విద్యార్థి వార్షికోత్సవం | డిసెంబర్ 23వ తేదీ వికలాంగులతో<br>ప్రత్యేక కార్యక్రమము. |

# కమలము - దళములు

సర్వ వ్యాపి అయిన, సర్వాంతర్యామి అయిన, శివస్వరూపుని బాహ్యాంతరములందు సర్వత్ర గుర్తించి, వినయ విధేయతలతో సేవాదళ సభ్యులందరూ ఆ విశ్వాసమును అభివృద్ధి పరచుకోవలెను. అనేక కల్పనలకు గురియై, ఊహలకు బానిసలై, సహనమును కోల్పోవక, వినయమును వీడక, సేవా కైంకర్యమును సాధించాలి. దానముకానీ, తపము కానీ, విజ్ఞానము కానీ, సనాతన ధర్మాచరణ కానీ, సత్యధర్మాలు కానీ, మరే దివ్యసేవకు తోడురాదు ఆధ్యాత్మిక మార్గమందు.

అయితే, ఆధ్యాత్మిక మార్గమందు పయనించు వారికి అంతరాయములు అడ్డులు కలిగేది సహజము. ఎంతవరకు అహంకార మమకారములను దూరము చేసిరి. ఎంతవరకు ఏకత్వభావము దృఢమైనది. ఎంతవరకు సేవాసాధనలో ఉత్తీర్ణులైరి. అని పరీక్షించుటకు కష్టములను కలుగజేయవలసియున్నది. ఈ పరీక్షలను ఎదుర్కొని, ఉత్సాహమును తగ్గించక, కర్తవ్యమును విస్మరించక, విజయమును సాధించాలి. అట్లుకాక, రుజుమార్గమును త్యజించి, ధైర్యమును కోల్పోయి, అరి షడ్వర్గముల దాసులై, అనర్హతను సంపాదించి జీవితమును వ్యర్థము గావించకూడదు. మీమీ గృహములందే కాదు, సంఘములలోను, దేశములో కూడ, వినయ విధేయతలను కాపాడుకొని మెలగాలి. అప్పుడు మీ కీర్తి దేదీప్యమానముగా జగమంతా ఆవరించును.

సేవ చేయుటకు అర్హత పొందాలంటే, మొట్ట మొదట హృదయమును సంస్కరింపజేయాలి. ఈ ప్రయత్నములో విజయమును సాధించినామా, అని మీకు మీరే పరికించి తెలుసుకొనుటకు వీలున్నది. ఎట్టి భావముతో, ఏ తలంపులవలన, ఏ ఉద్దేశమును దృష్టియందుంచుకొని, ఏ ఆశయాల ప్రేరణచే సేవ చేస్తున్నాము అని నిత్యమూ పరీక్షించవలెను. సేవయే జీవితకర్తవ్యము. జన్మసార్థకత, త్యాగమే దాని లక్ష్యము అని విశ్వసించి అట్టి భావముల నభివృద్ధి చేసిన, మాధుర్యము ననుభవిస్తాము.

సేవాదళము వారికి నేనప్పుడప్పుడు కొన్ని సూక్తుల నందిస్తుంటాను. Work is Worship; Duty is God అనేది ఒకటి! Hands in Society; Head in the forest అనేది మరొకటి. కర్మాచరణ వలనే కాయము కాలమూ పరిశుద్ధమయ్యేది. కాలమును పవిత్రము చేసే సేవాకార్యములతో ఆ పవిత్రయాత్రలో మీరు ప్రవేశించాలి, ఇదొక కర్మక్షేత్రము; ప్రతియొక కాయము కూడ నిష్కామకర్మల ద్వారానే పవిత్రతను పొందాలి. సేవాదళ సభ్యులలో ఎవరు ఎక్కువగా చక్కగా పనిచేశారు అనేది కాదు నాకు ముఖ్యము. చేసినది ఏ చిన్న పని అయినా, ఎట్టి భావముతో చేశారు, ఎట్టి హృదయముతో చేశారు అది ముఖ్యము! మీకు మీ మీ కుటుంబములలో సంఘములో గ్రామములో వేరువేరుగా కర్తవ్యాలు బాధ్యత లుండ వచ్చును: వాటిని ప్రక్కకు నెట్టి, మీరు పరోపకార మందు సేవలో ప్రవర్తించుట ధర్మము కాదు; అయితే,

స్వార్థ రహితమైన, ఫలాపేక్ష లేని సేవా కైంకర్య మందు కాయమును కాలమును వినియోగించుట అత్యవ సరము. ఈ సాధనను అభ్యసించి అనుసరించి ఆనం దించుట, మీకు మీరు చేయవలసిన ప్రధానమైన సేవ.

అభిమానము, అధికార మదము, మమకారము ఇవి సేవాదళ సభ్యులకు చాలా ప్రమాదము! ఇవన్ని ముళ్ళచెట్లు! ముళ్ళచెట్లు పెంచిన వారికి ముల్లుగుచ్చుట తప్పదు. కొంతమంది, వినయ విధేయతలను ప్రక టించుట, తమకు తాముచేసె అగౌరవము అనుకుం టారు, ఇంతటి అధికారము, బలము, ధనమున్నవారు పరులసేవలో నిరతులయ్యేది తప్పుకాదా, అని సందే హింతురు. అయితే, అధికారము దేహబలము ధనకనక వస్తువాహనాదులు కదలే మేఘములువంటివి. మీ జంట ఇంట వెంట వుండి కాపాడేది మీరు జేసిన సేవ మాత్రమే.

మీ మనస్సులో అహంకారము ఆడంబరము ఏ మాత్రమూ వుండకూడదు. ఎవరిపై కూడ ద్వేషము కోపము అసూయ మీలో వుండకూడదు. అహంకారము ఏకత్వమును అనేకత్వముగా చూపించి మోసముగావించును. అనేకత్వమును మరచి, అందరి లోనూ ప్రకాశించుచున్న దివ్యత్వమును తెలుసుకొని ఏకత్వమును గుర్తించి వర్తించటమే సేవ యొక్క పరమోద్దేశము,

ఢిల్లీ నుంచి వచ్చిన సేవాదళ సభ్యుడు రాజేశ్ ఖన్నా ప్రతి సభ్యుడుకూడా తనతో జోబిలో ఒక చిన్న మందుల పెట్టె తీసుకొని వెళ్ళాలి అని నిర్ణ యము చేసుకొమ్మన్నాడు. ఆయన అందించిన ఆద ర్శము అత్యవసరమే: ధర్మార్థకామ మోక్షానాం ఆరోగ్యం మూల ముత్తమం. అనారోగ్యమునకు ఏది కారణము? దేహమా? మనసా? దేహము, నీటి బుడగ: మనసు ఒక పిచ్చికోతి! మానవులు బుద్ధి తత్వమునకు ఆధిపత్యమిచ్చి దానినే అనుసరించి ఆచరించాలి. రాజేశ్ ఖన్నా ఆ పెట్టె చూపించి,దానిలో వుండవలసిన మాత్రలు, మందులు, పత్తి, బ్యాండేజీ, వీటిని చక్కగా నిరూపించినాడు, దానితో పాటు, మానసిక చికిత్సకు అవసరమైన మరి కొంత మందు లను మీ మీ హృదయమనే జేబునందు మీరు ఎప్పుడూ పెట్టుకొని యుండాలి. "విచక్షణ" అనే మాత్రలు, "ఇంద్రియనిగ్రహము" అనే మిక్స్చరు, ప్రేమ సహ నము వీటి రెండింటిని పొడి చేసి కొంత పవుడరు-ఇవి మీ హృదయమందు తయారుగా వుండాలి. ఇంద్రియ నిగ్రహము యోగులకు, బైరాగులకు అవసరమే కానీ, మనకెందుకు అని వాదంచుట చాలా పొరపాటు! ఇది నా కారు, నా పేరుతోనే రిజిస్టరు చేసినాను; నేనే డ్రైవర్ కూడ. మరి, ఇది నా కెందుకు ప్రమాదము తెచ్చిపెట్టును? అని, దానిలో బ్రేకులు బాగున్నావా అని పరీక్షించక, అహంకారముతో ఆడంబరముగా డ్రైవ్‌చేసిన, అపాయము తప్పదు అందువలననే ఈ దేహమనే దొక కారు; కన్నులే హెడ్‌లైట్స్; కడుపు పెట్రోల్ ట్యాంకు; నోరు హార్న్; మనస్సు స్టీరింగ్, ధర్మార్థ కామమోక్షములే టైర్లు; వాటిలోని గాలి: **Faith.** బుద్ధియే, **Switch.** ఇంద్రియ నిగ్రహమే బ్రేకు; ఇంద్రియ నిగ్రహము కలిగిన, చిత్తశుద్ధి. చిత్త శుద్ధి కలిగిన... జ్ఞానసిద్ధి!

సేవ అంటే, జీవారాధన; జీవులందరూ దైవ స్వరూపమనే భావముతో వారిని ఆరాధించుట. నోటితో పెద్దగ ఉపన్యాసముల నందించుట కన్న, పవిత్ర హృదయముతో, ప్రేమతో, సహనముతో కించిత్తు చేసిన చాలు. కర్మాచరణయొక్క కర్తవ్యమును ప్రత్యేకించి విచారించాలి. కర్మము ఫలితము కోసము కాకూడదు; ఫలితమును పొందుటయే ముఖ్యమని భావించువారు, అధికారమును దురుపయోగ పరచి,

ప్రజలను పెడమార్గము పట్టింతురు. భయభ్రాంతుల చేత విజయమును సాధింతురు. భయము పెట్టి బెదరించి ప్రజలను లొంగదీసి బలముచేత కార్యసిద్ధి పొందుదురు. ఈ రీతిగా జయము సంపాదించిననూ, అది నిజముగా అపజయమే అగును. క్రమమును ఒదలక, సత్యాన్ని వీడక, ధైర్యము జారనీయక, సాధించిన విజయమే శాశ్వతమగును.

సేవాదళమువారు యంత్రమును పూజించి, తాము కూడ, యంత్రమువలె జడస్వభావము పొందుచున్నారు ఏ సేవచేసిన, దాని అంతరార్థమేమి, దానివలన లభించే ఆత్మోన్నతి ఎంత, సేవ నందుకొనే వానికి లాభమేమి! అని విచక్షణతో పరిశీలించాలి. మంత్రములను మంత్రార్థములనూ ఆచరణలో తెచ్చి ఆనందించే సుగుణ వ్యక్తులు కావాలి, సభ్యులు! ఎత్తు పొడుపు లావు అనేవి Bamboo కొనేటప్పుడు గమనిస్తాము; చెరుకు కొనుకొనేటప్పుడు దానిలోని రసము ఎంత అని గమనిస్తాము. అట్లనే, మనిషికి గుణములవలనే విలువ. స్వయం సాధన వలన, సద్గుణాభివృద్ధిగావించుకొని, పరులకు సేవజేసి, తన్నుతానుద్ధరించుకోవటమే, సేవాదళము యొక్క అంతరార్థము.

మరొక "సూత్ర" మును కూడ నేనప్పుడప్పుడు చెప్పుతుంటాను: "You cannot always oblige; but you can always speak obligingly" అంటే చేతినుంచి మంచిపనిచేయుటకు సాధ్యము కాకపోయినా, నోటితో మంచి పలుకులు రావుటకు ఏమి అడ్డము?" బాహ్యాచరణలో మీకూ మీ జిల్లా కన్వీనర్లకూ భేదాభిప్రాయాలు రావచ్చు; మీ సలహాలను వారు పురస్కరించక పోవచ్చు; అయితే, ఏ ఏ సంస్థల వారు వీటిని తమకు తామే సమరసముగా నిర్ణయించుకోవాలి కానీ నేను అధికారి, నా మాట జరిగేతీరాలి అని ఎవరూ అహంకారముగా ప్రకటించ కూడదు.

పదివేల మంది సేవాదళ సభ్యులు ఇక్కడ సమావేశమైనారే కానీ, ఈ సంస్థ యొక్క అంతరార్థమును పవిత్రతను గుర్తించినవారు చాలా తక్కువ! శ్రీసత్యసాయి సేవసమితి, శ్రీసత్యసాయి మహిళా విభాగ్, శ్రీసత్యసాయి సేవాదళము, శ్రీసత్యసాయి భజనా మండలి శ్రీ సత్యసాయి బాలవికాస్ – అన్నిటిలో శ్రీసత్యసాయి ప్రాణస్వరూపముగా వున్నాడు. అదే అన్నిటికిని అంతర్సంబంధము, ఒకే హస్త మందు బొటనిప్రేలు Thumb అది సేవాసమితి! మిగిలిన నాలుగు సంస్థలతో కలసిమెలసి అందరి యోగక్షేమమును, అభివృద్ధిని, కార్యకలాపాలను ప్రోత్సహించే జవాబ్దారి, సమితికున్నది. చూపుడువేలు మహిళా విభాగ్. మధ్యనున్నది. సేవాదళము ఉంగర ప్రేలు భజనా మండలి, అందరికీ ఉల్లాసము, ఉత్సాహములనిచ్చేది. తరువాత, అన్నిటికన్న పొట్టి, చిన్నది, ఆ ప్రేలే బాలవికాస్. నిర్మల నిశ్చల నిస్వార్థహృదయములు కలిగిన లేతమనస్సులు! అయితే, దీనిని గమనించండి: ఎవరికైనా బుద్ధిచెప్పాలంటే, మనము వారి ఎదుట చేయు హెచ్చరికయందు బాలవికాస్ ప్రేలే, ముందు! అంతే. చిన్నపిల్లలనుంచి పాఠము నేర్చుకొని ద్వేషాసూయలను మాని స్వార్థమును నెట్టివేయాలి. అని అర్థము ఒకే హస్తములోని ఐదుప్రేళ్ళవలే, ఈ ఐదు సంస్థలూ ఏకం కావాలి. దళములన్నీ కమలములో మధ్యనున్న 'కర్ణికా'నుంచి వికసించి, దానినుంచి పోషింపబడి యుండుటచేతనే, అంత అందముగా ప్రకాశించేది. కాబట్టి, మీరందరూ సత్యసాయి ఆదర్శాలను అర్థము చేసుకొని, అనుసరించి, తరించాలి అనేది, నా ఆశ. ఆదర్శాలను అనుసరించక పోతే, దళములు విడివిడిగా రాలిపోవును. వేరే భావములకు చోటివ్వక, భేదము అసూయ అహంకారము వీటిని దూరము చేసుకొని, ఒకతల్లి బిడ్డలవలె, ఏ కోహం

బ్రహ్మాస్మి అనే ఆదరము నాదరించి, ఒకే ఆత్మ స్వరూపము అనేక రీతిగా మన ముందు కనబడు చున్నది అనే దృఢముతో సేవలో దిగండి. మీకు ఎన్నడు విజయమే.

సత్యసాయి సంస్థలో ప్రేమయే ప్రధాన సాధన. సభ్యులలో అసూయ కాని, అశ్రద్ధ కానీ ఆడంబరము కానీ అంకురించిన, అది సంస్థకే ద్రోహము చేసినట్టు. గడచిన కాలము గడచిపోయినది; ఉన్నది స్థిరము కాదు; రేపు మనది కాదు. కాబట్టి, గడచిన దానికి చింతించక, ఈనాటి నుంచి అయినా, అన్యోన్యత, అనురాగము, ప్రేమతత్వములను పెంచుకొని, కార్య క్షేత్రమును ప్రవేశించండి, పరుల దోషములను వెదకే దెందుకు? తన దోషములను వెతికితే, దానినంచే లాభము, మంచి ఫలితము. పరులలో దోషము కని పించిన, అది వారిలోనిది కాదు, మీలో ఉన్న దోషమే. ఏ దోషమూ లేనివానికి, ఎక్కడను దోషమే కని పించదు.

మీరందరూ చేయవలసిన పనిని చేస్తున్నారా, అని, నాకు అనుమానమే! ఇపుడు గ్రామసేవ అంటారు. గ్రామములలో రోడ్డులు తీర్చిదిద్దడము, మోరీలను సరిచేయటము, బజారులను ఊడ్చటము, ఉపన్యాస ముల నందించటము, భజన చేయించటము ఇట్టి పను లను మీరు చేయుచున్నారు. నీరు తాగే టంబ్లరును బయట శుభ్రపరిచితే చాలా? సత్యసాయి సంస్థలవారు గ్రామప్రజలయందు మనః పరివర్తన జరుగునట్టి సేవాకార్యక్రమమును ఏర్పరచుకోవాలి. ఒక పల్లెలో 1000 ప్రజలుంచే, వారిలో ఎంత మంది దురభ్యాసా లకు, దురాచారాలకు, దుర్గుణములకు లోనైయున్నా రని తెలుసుకొని, జూజు త్రాగటము, వీటిని నిలుపు టకు ప్రయత్నించాలి. చక్కని బోధనిచ్చి, వాళ్ళ ప్రీతి గౌరవములను సంపాదించి, వాళ్ళ దురభ్యాసాల వలన కుటుంబమున కెంత బాధ అని నచ్చచెప్పి, వాళ్ళ కాళ్ళు పట్టుకొని అయిన సన్మార్గమునకు తీసి కొని రావలెను. రోడ్డులు, ఆస్పత్రులు నీరు సప్లై మొదలగువాటిని ప్రభుత్వము చూచుకొనును. సత్య సాయి సంస్థలు చేయవలసినది ఇది: ప్రతి గ్రామము లోను సత్య ధర్మ శాంతి ప్రేమల అభివృద్ధి!

ఇట్టి దుర్భావములు దుర్గుణములు మీలో కూడ చేరక జాగ్రత్తగా వుండండి. మీ ఊహలు తలంపులు వేషములు చూపులు మాటలు అన్నీ పవిత్రముగా వుండాలి. అనుకరణములో ప్రవేశించకూడదు. బెల్బా టం సైడ్‌బర్న్స్ ఇట్టివి పెట్టుకొని సేవ ఎట్లుచేస్తారు దానిని స్వీకరించే వారెవరు? మీ హృదయమును మీరు అనుసరించండి; **follow the Master. Master** అంటే, మీలోని ఆత్మారాముడే! **Face the Devil Devil** అంటే అరిషడ్వర్గాలు. **Fight the end.** ఏది అడ్డువచ్చినా, సత్సంకల్పమును సడలించరాదు. **Finish the Game** నిత్య సత్య భక్తులుగా తయారు కావాలి. మీలోని శివత్వము ఉచ్ఛ్వాస నిశ్వా సమందు ప్రతి క్షణమూ మీకు "సోహం" "సోహం" అని ఉపదేశించుచున్నది. ఆ సోహం స్మరణ నిలిచి నపుడు, జీవుడు శవం అయిపోతాడు! "సోహం" తత్వము అన్ని జీవులయందూవున్నది. కాబట్టి పరు లకు మోసముచేయక, వారిని నొప్పించక, అందరి యందూ వెలుగుచున్న పరంజ్యోతి స్వరూపుడైన పరమాత్ముని ఆరాధించండి.

ఈ సమావేశము భవిష్యత్తుకు చక్కని పునాది వేసియున్నది. "అదిగో! నా ఆరాధనా దైవము" అని అందరిని స్వాగతించాలి. మీ **State President** లు

కానీ ఎవరేకానీ, తాము నడచి మీకు త్రోవచూపించాలి. వెనుకనుండి నూకేవారు కాకూడదు. ఏదైనా సమస్యలు వచ్చిన, మనలోనే దర్శించుకొని కూర్పులు మార్పులు చేసుకొనేడి ఉత్తమ మార్గము. ఈసంస్థలో అన్నిటికీ అందరికీ ఒకే మార్గము. ప్రేమమార్గము దానిననుసరించిన, దుఃఖనివృత్తి, ఆనంద ప్రాప్తి.

బాబావారి దివ్యోపన్యాసము
22-11-1978

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4 | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5 | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 8 | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 9. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 11. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 14. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రము, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

**ఇండియా**

| | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

**విదేశములు**

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 72 వ పుటలో చూడండి )

gd. No. H/HD/354

March 1979

enced to post without Pre-payment No. H/8

ఇంతియే కాదు; ఈ క్రోధమనేటటువంటిది దేహాన్ని కూడను భస్మము కావిస్తుంది. ఒక పర్యాయము కోపమున పడితిమా మూడు నెలలు మనము తినిన ఆహారపుశక్తి కూడనూ క్షీణించిపోతుంటాది. క్రోధము మన మనస్సులో చేరెనా దేహామంతా వేడెక్కుతుంది. రక్తమంతా వేగముగా ప్రవహిస్తుంది. తద్వారా నరాల బలహీనము ఏర్పడుతుంది. తిరిగి ఈ శక్తిని తెప్పించుకోవడానికి మూడునెలలు మనము కూర్చుని భుజించాలి. తద్వారా మనము చేయవలసిన సాధనలను, పవిత్రమైన కర్మలను బలహీనత ఏర్పడుతుంది. కనుక మనము ఈ యొక్క క్రోధమునకు ప్రవేశము ఇవ్వకుండా చూచుకొనడము సాధకుల యొక్క ప్రధాన కర్తవ్యము.

—బాబా